నాటకసంఘ గ్రంథమాల 2.






# శ్రీ జగద్గురువు—అవతారము.

చిట్టిమూరు రామయ్య, బి. ఏ. యల్. టి.
గ్రంథకర్త.

---

శ్రీయుత బచ్చు నాగభూషణరావుగారి
ధనసహాయము వల్ల
ముద్రింపబడినది.

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల,
బెజవాడ, ౧౯౨౭.

వెల. అ. 2.

నై, దయచేయుడు, (16) అగచ్ఛ యుక్తోవిథ వేనశక్తేః = రేమ మ హాశైథవశక్తితోఁగూడినవాడవై దయచేయుడు, (17) స్వాణాంసురాణాంచగురుర్యతోసి = నరులకును దేవతలకును మహాగురువగు హే మహాప్రభో! (18) భవదాగమేచ్ఛం = తమరాకకై యెదురుచూచు చుండు, (19) లోకం త్రాయస్వ = లోకమును రక్షించుడు.

# జగద్గురువు నవతారము.

దివ్యజ్ఞానసమాజమున కగ్రాసనాధిపతియై లోకోపకారతత్పరయయి, నిక్కాలమున లోకమునందలి యజ్ఞానమును దొలగించి పరతత్వజ్ఞానమును వెదఁజల్ల సేయింబగల్లు శ్రమపడుచు నీ దేశమా దేశమనక భూమండలమంతయు సంచారముచేయుచు, నుపన్యాసములం జేయుచు లోకోపకారరూపమగు భగవత్కైంకర్యము నొనర్చుచుండునట్టి అనిబెసెంటుఅమ్మగారు సమీపకాలమున లోకానుగ్రహార్థము జగద్గురువు 'లవతరింపబోవుచున్నారనియును, లోకులా మహానుభావుని యనుగ్రహమునకుఁ బాత్రులు కావలయుననిన తమతమ భావముల శుద్ధముగఁ జేసికొనవలయుననియు, పరిశుద్ధమనస్కులై దోషదర్శన బుద్ధిని విడచినంగాని మానవులు మహనీయులయందలి మహిమంజూడ శక్తులు గారనియును దాదాపుఁ పది సంవత్సరములుగ లోకమున బాహాటముగఁ జాటించుచున్నారు.

లోకములోఁ బెక్కండ్రు ఆమాటను వినినమాత్రముననే తమతమ శుద్ధాంతఃకరణములకది సమంజస

ముగఁజూపట్టు దానియందు దృఢమగు నమ్మకముగలవా
రై యాపుణ్యమునకు బాత్రులుగాఁ బ్రయత్నముసేయు
చున్నవారు. ఐనను మఱికొందఱు అట్టివార్తను నమ్ముట
కుఁదగిన కారణములంజూపినంగాని నమ్మజాలక సంశ
యించుచున్నవారు. అట్టివారు కారణములందెలియఁ గోరు
టయు యుక్తమే. ఏలయన వారువారు తమబుద్ధికి యుక్తా
యుక్తమనితోఁచి హృదయమునకు దృఢమగు నమ్మక
ము తనంతన పుట్టవలెను గాని యేవిషయమునుగాని గ్రుడ్డి
వానివలె నమ్ముట శ్రేయస్సుకానేరదు. భగవంతుఁడిచ్చిన
బుద్ధిని ప్రతిమానవుఁడును వినియోగించవలయును గాని
దానికిఁబ్రచారములేక యుండఁజేయరాదు. గాన ఈనమ్మ
కమునకుఁ గారణములెవ్వియో యించుక సూచించిన బా
గుగనుండునని యాయమ్మగారు చెప్పినవిషయములనను
సరించి యీవ్యాసము వ్రాయఁబూనితిని.

ఇందుసూచించిన విషయములను జదువరులు కొం
చెము శ్రద్ధతో నిష్పక్షపాతముగ మనోవికారములకు
లోనుగాక విచారించి యిందలి సారమెంతమట్టుకు దమ
కు సరియనితోఁచునో అంతమాత్రము గ్రహింతురుగాక.

• ఇట్టినమ్మకమునకు మూలము మూఁడు తెఱగు
లుగనున్నయది.

(1) ప్రస్తుతపు బ్రపంచస్థితినిబట్టి యట్టిమహనీయు
నిరాక యవసరముగ నున్నది.

(2) భూమండలమున నిక్కాలమున, గొన్నిమా

ర్పులు కలుగుచున్నవి. ఆమార్పులను బట్టి చూడ సమీపకాలములోనే యట్టియవతారము నిరీక్షింప, దగియున్నదని స్పష్టమగుచున్నది.

(3) లోకములో ప్రస్తుతమున ప్రబలియుండు మతముల నవలంబించు వార లందఱిలో నేదేశమున జూచినను అట్టిరాకను నిరీక్షించుచుండుట గానవచ్చును.

ఈమూడు విషయములను గొంచెమువిస్తరించి వ్రాసెదను. అయినను మొట్టమొదట నొకవిషయము దీనికాధారముగ నంగీకరింపవలెను. ఈవిషయము కేవల ప్రకృతివాదులగు నాస్తికులకొఱకుద్దేశింపఁబడినదిగాదు. ఇంద్రియగోచరములగు విషయములకంటె వేరుతత్త్వమొకటియున్నదని యంగీకరించని వారలకు జగద్గురువునవతారమును గుఱించిన ప్రస్తావనయే విరుద్ధముగదా! అతీంద్రియతత్త్వ మొకటియున్నదనియును, ఈ ప్రపంచ చక్రమును ద్రిప్పుచు లోకవ్యాపారము నడుపుటయందు మానవులకంటె సర్వసమర్థులై యమానుషశక్తి గలవారున్నారనియును నమ్మువారలకీవిషయము యోచింపతగినదికాని కేవలనాస్తికవాదులకుగాదు.

ఆధునికులగు ప్రకృతి శాస్త్రజ్ఞులు సైతము ఇంద్రియగోచరములగు ప్రకృతి సముదాయములుగాక యంతకంటె సూక్ష్మములగు తత్త్వములున్నవని యూహించవలసినట్లున్నదని చెప్పుచున్నారు.

ఏ దేశమునందుగాని యే సంఘమునందుగాని గొ

ప్పయుత్సాహముపుట్టి యాయుత్సాహమున గొప్పగొప్ప కార్యము లుద్యమింపబూనుకొను సాహసయుతములగు నా యుద్యమముల నెఱవేర్పఁగలమహాపురుషులుద్భవించుచుండుట ప్రపంచచరిత్రమువలన స్పష్టమగుచున్నది.

మానవకోటిచరిత్రమంతయుఁ బరికించిచూడ నయ్యది నదీప్రవాహమువలె నొక్కరీతినిబోవుటయు మాఱుగ సముద్రతరంగములవలె హెచ్చుచుఁ దగ్గుచుఁ జక్రగతివలె పైకిని క్రిందికిని దిరుగుచున్నట్లు తెలియవచ్చుచున్నది.

లోకపరిపాలనమునకు ఎంతశక్తిమంతులైనను మనుష్యమాత్రులగు చక్రవర్తులు, రాజులు, సామంతులు, వారిమంత్రులు, మాత్రముగాక వారలందఱిని చదరంగపుఁ బీఁటపై బలమును నడుపునట్లు నడుపుమహానీయులగు దేవతలు దేవసములగు మన్వాదులగు మహానీయులున్నవారనుట యన్నిమతముల వారును అంగీకరించువిషయము. ఆయామతములందట్టి మహాపురుషులకు పేరులు వేలువేలుగనుండినను, అట్టివారున్నారని మాత్రము అందరకు నంగీకారమే. కొన్నిమత గ్రంథములయందు వారిని దేవతలని చెప్పుదురు. మఱికొన్ని మతముల వారట్టివారినే "ఏంజెల్స్, ఆర్కేంజెల్స్," అనియు చెప్పుచు వారిని దేవదూతలని సంస్కృతగ్రంథముల భాషాంతరీకరింతురు. వీరుగాక యార్యమత గ్రంథములయందు ఋషులనియు, జీవన్ముక్తులనియు, దేవర్షులనియు, ఆధికారికపురుషులని

యును బిలువఁబడు మహాపురుషులున్నవారని స్పష్టముగ నిరూపింపఁబడియున్నది. వారెవ్వరనగా పూర్వకల్పముల యందుఁగాని, పూర్వమన్వంతరముల యందుఁగాని మఱి యు నీమన్వంతరముననే యాదియందుఁగాని అస్మదా దులవలె సంసారమున వర్తించుచుండియుఁ బరిపూర్ణాను భవ జన్యజ్ఞానముగలవారై సంసారసముద్రమును దరించి ముక్తులై బ్రహ్మానందానుభవమున నీశ్వరస్వరూపులయ్యు ను, మనవంటిపామర జనోద్ధారణమునకై యీకల్పము ననో యీమన్వంతరముననో శరీరధారులైగాని, యీమ న్వంతరముననే పరిపూర్ణులయ్యును, జీవన్ముక్తులుగ లో కోపకారమునకై శరీరములను విడువక యోగబలముచే దేహధారులుగ వర్తించునట్టి మహానుభావులేవారు.

అట్టిమహాత్ముల నుద్దేశించియేగదా శ్రీశంకర భగవత్పాదాచార్యులవారు,

"శాంతామహాంతో నివసంతిసంతో
వసంతవల్లోకహితంచరంతః।
తీర్ణాస్స్వయంభీమభవార్ణవంజనా
నహేతునా-న్యానపితారయంతః॥

(వివేకచూడామణి).

అనివ్రాసియున్నారు.

వీరలే హిందూమతగ్రంథములయందుఁ బేర్కొనఁబ డియుండు మన్వాదులు, ఋషులు, మహర్షులు, దేవర్షులు లోనగువారు.

శ్లో॥ మన్వంతరేషు భగవన్ యథామన్వాదయస్త్విమే।
యస్మిన్ కర్మణియేయేన నియుక్తాస్తద్వదస్వమే॥
శ్రీశుకః॥ మనవో మనుపుత్రాశ్చమునయశ్చమహీపతే
ఇంద్రాః సురగణాశ్చైవ సర్వేపురుషశాసనాః
(శ్రీమద్భాగవతము).

శాక్యమునిచే నుద్ధరింపఁబడి యిక్కాలమున చీనా, జపాన్, టిబెత్తు, సింహళము, బర్మా మొదలగు దేశములం బ్రసిద్ధిగాంచియుండు బుద్ధమత గ్రంథముల యందు బుద్ధులనియును, భవిష్యద్బుద్ధులగు బోధిసత్త్వులనియును మఱియును పెక్కునామములచేఁ బరఁగువారిను వీరలే. వీరలందఱును దేవతలు, మన్వాదులగు ఋషులు, మహాత్ములు, బుద్ధులు, బోధిసత్త్వులు, సామాన్యముగ నిక్కాలమున మనుష్యులతో బహిరంగముగఁగలిసిమెలసి సంచరింపకపోయినను "మాదృశాంగ్రామ్యబుద్ధీనాంబోధాయ" అనునట్లు మనవంటియజ్ఞులకును, అల్పజ్ఞులకును జ్ఞానబోధచేయుటకై యదృశ్యులైసంచరించుచు హృదయ కవాటములయొద్ద కాచియుండి కామక్రోధలోభ మోహమదమాత్సర్యములు, అహంకార మమకారములులోనగు గట్టిగడియలను గొంచెమువదలించి హృదయకవాటము నెపుడు సడలింతురాయని కనిపెట్టియుండి సమయముదొరకఁగనే హృదయమునఁ బ్రవేశించి హృదయమున స్థిరముగనాటియుండు కామములను దొలఁగించి యందుదట్టముగనిండియుండు నజ్ఞానాంధకారమును బో

గోష్ఠీజ్ఞానదీపమును వెలిగింతురు. అట్టివారలు కేవలమాత్మజ్ఞానమును బోధచేయుటకున్న వారుగాని ఐహికవిషయములకు లౌకిక వ్యవహారములలోఁ బ్రవేశించు వారు కారనుకొనరాదు.

మనదేశమునఁ బ్రసిద్ధములగు పురాణేతిహాసములం బరిశీలించిచూడఁ బూర్వకాలమున దేవతలును మహర్షులును, నారదాది దేవర్షులును, బలుమారు రాజసభలకేతెంచి రాజులను కుశలప్రశ్నంబులడుగుచో రాజకీయవిషయములను ప్రజాక్షేమమును, లోకమున ధర్మరక్షణావిషయములను, యుద్ధములు మొదలగు ప్రజాక్షోభములు లేక ప్రజలు సుఖంబుండుటయు, నీమొదలగు లౌకిక విషయములను విచారించి పోవుచుండుట విశదముగ నున్నదిగదా! ఇక్కాలమున సామాన్య జనుల మనోభావములఁ జూచినను, దుస్తరములగు కష్టములు ఎదురగుచున్నయవి. ఇంత మాత్రే వారలు కేవల విషయాసక్తులయి స్వప్రయోజన పరులై యుండుటంబట్టి యట్టిమహాత్ములు పూర్వమువలె మనబోఁటి సామాన్యజనులతో బహిరంగముగ మెలఁగుపుణ్యము మనకులేక పోయెననుటకు సంశయములేదు. ఐనను, బహిరంగముగ సంచరించకపోయినను లోకసంరక్షణవ్యాపారమును వారు వదలికొనిరనుటకు ఆస్పదములేదు. మనమందఱమట్టివారుండుటను నమ్మినను నమ్మకపోయినను, వారియనుగ్రహమును కోరినను కోరకపోయినను, మన యంతరంగదృష్టి కామక్రోధాహంకా

రమమకారములను పొరలచేఁగప్పఁబడి, మదాంధులమై సర్వశక్తులమనుభ్రాంతితో వర్తించినను అపారదయారస ముద్రులగు నామహాత్ములు తల్లిబిడ్డలను రక్షించునట్లును గురువు శిష్యులను మన్నించిరక్షించురీతిని దయతో మనలను క్రమక్రమమున స్వధర్మమును నడపుచు, మనయహంకారాదులచే లోకమునఁగలుగువైపరీత్యముల నవరించుచు లోకవ్యవహారముల నడుపుచునేయున్నవారు. అట్టిమహనీయులలో నొక్కొక్కఁడు అప్పుడప్పుడు లోకమున నవతరించి కీర్తిమహించిలోకమున కపారముగు మేలుచేసి యంతరింతురు. అంతేకాదు విశేషసందర్భములలో ధర్మసంస్థాపనమునకై భగవంతుఁడుతానేయవతరించునని శ్రీగీతాశాస్త్రమునందు నొక్కివక్కాణించియున్నారుగదా!

ఇంతట నీవిషయమును విరమించి వ్యాసముయొక్క ముఖ్య విషయమును నాలోచింతము.

ప్రథమమున లోకముయొక్క ప్రస్తుతపు నవసరమునుగూర్చి యోచింపవలెను.

ప్రపంచమున నిప్పటిస్థితి నాలోచింపగా, మతవిషయములందుఁగాని, ప్రకృతిశాస్త్రవిషయములలోఁగాని, మఱియు రాజకీయవ్యవహారములలోఁగాని, సాంఘికములగు కట్టుబాట్లవిషయములలోఁగాని, అర్థశాస్త్రవిషయములలోగాని, మఱియేవిషయమునఁ జూచినను, దుస్తరములగు కష్టములు ఎదురగుచున్నయవి. ఇంతవఱకుండిన పద్ధతుల

న్నియు, నిక్కాలమునకు సరిపడకయు, ఇప్పటి కష్టముల నివారించుటకు సాధ్యముకాకయు జనులు దిక్కుదోచక యున్నవారు. క్రొత్తక్రొత్తమార్గములైనను అవలంబింప వలయునా. లేదా, మానవకోటికభివృద్ధి ఇంతటితో నిలు నవలసియుండునా. మానవకోటికభివృద్ధి యింతటితో ని లుచుననుటయసంగతము. అట్లుకానిచో క్రొత్త పద్ధతు ల నవలంబించవలయును. ఇప్పటివఱకు మతవిషయముల లోనేమి, అర్థశాస్త్ర ప్రకృతిశాస్త్ర విచారములలోనేమి, సాంఘికములగు నేర్పాటులలోనేమి, యత్యావశ్యకవిషయ ములను సాధించిన పద్ధతులు ఇపుడు తుదముట్ట నిష్ప్ర యోజనములై యున్నయవి. క్రొత్తమార్గములుదోచక పూర్వపు యేర్పాటులు ప్రయోజనపడక పురోవృద్ధి యు పాయములు దరికట్టియున్నవి.

అందు మొదట మతవిషయములఁ జూతము. అ నాదిగా మనదేశమునందు ప్రబలియుండిన యాచారము లు చాలమట్టుకనాదరణపాత్రములైనవి. మధ్యకాలము లో కేవలప్రకృతి వాదములు బలిసియుండెనుగదా! జను లకు బుద్ధికౌశలము వృద్ధికానుకాను ప్రతియాచారమున కును హేతువుల వెదకుట సాధారణమయ్యెను. బుద్ధి సూక్ష్మము కాగాకాగా తామవలంబించునాచారములకు సరియైనకారణములు గనబడనియెడల శ్రద్ధాళువులును, విచారపరులునగు వారలకుసైతము పూర్వాచారముల యందనాదరణబుద్ధి వృద్ధిగాక తప్పదుగదా! ఇట్టిసమయ

మున పాశ్చాత్యులవలన గ్రహించబడినప్రకృతిశాస్త్రజ్ఞాన ము నాస్తికవాదమునే సూచించుటచే క్రమక్రమమున పూర్వాచారముల యందనాదరణబుద్ధి వృద్ధియాగును. పాశ్చాత్యుల విద్యాపద్ధతులంతో స్పర్శమైనను లేని వారినిచూడవారు పూర్వాచారములకు మూలములగు యథార్థతత్త్వముల నించుకయైనను తెలిసికొనజాలక కేవలబాహ్యాచారములే ముఖ్యములను తలంపుగలిగి సపూర్వాచారపరాయణులగుటంబట్టియు నూతన పద్ధతుల నవలంబించువారల మనోభావముల నెరిగి వారలసంశయములకీర్పుటకుశక్తిలేక వారల మనోభావముల పరాభవించి నిరాకరించుటచేతను పూర్వాచార తత్పరులకును, ఆధునిక నవనాగరకులకును ఐకమత్యములేక దినదినము నకు వివాదాంశములు హెచ్చుచున్నవి.

ఇందుకు దృష్టాంతము. వర్ణాశ్రమ ధర్మముల ప్రస్తుతస్థితి యెట్లున్నదో చూతము. వర్ణధర్మముల యందు విశేషసంకరమైయున్నది. కలియుగము ౫౦౦౦ సంవత్సరములు నిండగా వర్ణసంకర మగునని యందరును చెప్పుచున్నారు గాని వర్ణసంకర మన నేమియో స్పష్టముగ తెలిసికొనునట్లు కానరాదు. వర్ణసంకర మనగా దృష్టిదోషమును పాటింపక కలసి భోజనాదులు చేయుటయని సామాన్యముగ తలచుచున్నారు. యథార్థముగ వర్ణసంకరమన్న నంతకంటె లోతుకు దిగి చూడవలయును. అగ్రజన్ములని పిలుచుకొనువారియందు బ్రాహ్మణధర్మముల

గు శమము, దమము, క్షాంతి, ఆర్జవము, సమత, సత్య
త లోనగు ధర్మములు క్షీణించి, విషయాసక్తి ఇంద్రియ
లోలత్వము, స్వార్థపరత్వము, ఆముష్మిక విషయముల
కంటె నైహికవిషయములయందెక్కుడు ఆసక్తియును,
క్షత్రియులయందు ఓజస్సు తేజస్సు ధృతి దాక్ష్యము,
యుద్ధములయందు వెన్నుచూపక పోరు ధైర్యసాహస
ములులేక అధికారమునందు ద్రవ్యమునందు భోగము
లయందిచ్ఛ హెచ్చుటయు వైశ్య శూద్ర గర్భముల
జనించినవారిలో కొందరియందైనను శమదమాదులు గన
బడుటయే నిజమైన వర్ణసంకరము. ఎప్పుడు అగ్రజన్ములు
తమకు స్వాభావములుగ నుండవలసిన ధర్మములనుండిచ్యుతు
లైరో, అట్టివారి కుటుంబములయందు, పరిశుద్ధులైన జీవు
లు జన్మించుట దుర్లభము, కావున యోగ్యులును పరిశు
ద్ధులు నగు జీవులు వర్ణాంతరములలో యోగ్యులును,
భక్తులును, ఇంద్రియనిగ్రహములుగలవారు నగువారి గర్భ
ముల జనింతురు. దేశాంతరముల మతాంతరులలోను
జనింతురు. అప్పుడు బాహ్యజన్మమునకు సరియయిన
గుణధర్మములు లేకపోవుటయే వర్ణసంకరము. అట్టివర్ణ
సంకరము కలుగగా, యథార్థముగ పూర్వకాలమునందు
వలె అన్యోన్య అనుకూల్య ప్రవర్తనము దుర్లభము. ప్రవ
ర్తనమునందు, అంతరంగ పారిశుద్ధ్యమునందు ఏలాటి భే
దములు లేకపోయినను జన్మమున మాత్రము విప్రుల
మని గౌరవము కోరినచో గౌరవము దక్కదుగదా! కా

వృసనే బ్రాహ్మణులకును బ్రాహ్మణేతరులకును వైషమ్యములు కలిగి అట్టి అంతఃకలహములవలన దేశము శ్రీణదశకువచ్చునట్లు తటస్థించినది. వీరలయందు అన్యోన్యవైషమ్యములను పోగొట్టిసోదరభావమునుఅభివృద్ధిచేయఁగలశక్తిమంతులెవరునుగానరారు. ఇట్టివిషయములసనాతనముఖ్యధర్మములకు విరుద్ధములేకయే కాలోచితసంఘసంస్కరణమవశ్యమనియట్టిసంస్కరణమునకైయత్నించుధార్మికులను కులభ్రష్టులనియును మతద్వేషులనియు పూర్వాచారపరాయణులు,దూషించుచువీరలు కేవలస్వార్థపరులైబ్రాహ్మణేతరులను తలయెత్తకుండ తమయధికారమును సాగించుకొనువారలని వారలు దూషించుచు ఉందురు కాలమునపీఠాధిపతులు, ఆచార్యులు లోనగువారు ఇవ్విషయములయందు జోక్యము పుచ్చుకొనకయె తమకార్యములు చేతనైనంతవఱకును జరుపుకొనుచున్నారు. ఇట్టి స్థితి అంత్యములేదా! భారతమాతకువచ్చియుండు ప్రస్తుతపు దుర్దశను బట్టి మహనీయులగు లోకపాలకబృందమునకు కనికరము లేదా! అట్టి బుద్ధిసంఘమునుండి మహనీయుడొకఁడు అవతరించి యీ దౌర్భాగ్యస్థితిని తొలగించివేయఁడా యని యెందరో భక్తులు పలవరించుచుండ నామహనీయుఁడు భక్తులు మొఱలను వినరా? అట్టివారు కరుణించి ప్రసాదమును ఉద్ధరించుట కింతకంటె సమయము, దేవులారా!

ఇటీవలనుండిగాక లౌకికసంపర్కములు విశేషముగ మారి యున్నవి. ప్రాచ్యమువారేదేశస్థులుగాని.

శ్రీ చక్రవర్తి గారు వేలకొలది మైళ్లదూరమునసుండు ఇంగ్లాండు ద్వీపవాసులు. రాజకీయ విషయములను నిర్వహించుటకును, రాజాజ్ఞలను నెరవేర్చుటకును, విద్యాభ్యాసమునకును, దేశాభిమానులగు సత్పురుషులు దేశాంతరగమనము చేయవలసియేయున్నది. నౌకాయాత్రలు చేయక తప్పదు. ఇంగ్లీషువారి సామ్రాజ్యమునకంతయు ముఖ్య రాజధానియై శ్రీ చక్రవర్తిగారి నివాసస్థానమగు లండన్ పురమునందు హిందూదేశ ప్రభుత్వమునకు మూలస్థానమగు "ఇండియాకౌన్సిల్" అనుసభయును, మఱియు మనదేశమున చెన్నపురి, కలకత్తా, బొంబాయి మొదలగు పట్టణములయందుండు హైకోర్టులను ఉత్కృష్టన్యాయస్థానములకంటె నధికమైన "ప్రివికౌన్సిల్" న్యాయస్థానమును, మఱియు నీసామ్రాజ్యమునకంతటికిని ముఖ్యచట్ట నిర్మాణసభయగు పార్లమెంటు సభయును ఉన్నవిగదా! ఆసభలలో కార్య నిర్వాహమునకును, ఉత్కృష్ట దేశాభిమానులును, ఉదారచరితులును, సత్యధర్మపరాయణులునగు హిందూదేశవాసులను, రాజప్రతినిధులుగ శ్రీ చక్రవర్తి గారు నియమించుచుండ, నట్టియుద్యోగములను భరించి మాతృభూమియగు మనదేశమునకు అపారమగు మేలుచేయుటకును, భరతఖండమునకును, తద్దేశవాసులకును గౌరవము సంపాదించుటకును, హిందువులలో నుత్తములగువారు, నౌకాయాత్రచేసి దేశాంతరగమనము చేయవలసియే యున్నయదికదా! ఇట్టిసందర్భములకు దగినట్లు దేశాంతర

గమనమునకు వలయునేర్పాట్లుచేసి, దేశాభిమానముతో దేశక్షేమముకొఱకు శ్రమవ్యయములకోర్చి దేశాంతరమునకుపోయి తిరిగివచ్చినవారలను గౌరవపాత్రులుగ భావించి స్వాగతమిచ్చుటకు బదులుగ వారలయందు దోషారోపణముచేసి కులభ్రష్టులుగ నెంచుట కృతఘ్నతాదోషమును వడికట్టుకొనుటయేగదా! మఱియు నీదేశమునందు రాజకీయోద్యోగములలో గొప్పవియగు స్థానములం గొన్నింటికి, ఇంగ్లండుదేశమునకుంబోయి యచ్చటివిద్యాలయములలోఁజదివి యచ్చట సర్వశాఖాలం పరీక్షలం దేరి యాంబిరుదుల వహించివచ్చిన వారలనే నియమించుట ప్రభువాజ్ఞగనున్నది. ఆ గౌరవమునుపొంది యాపదవినుండి దేశమునకు మేలుచేయవలయుననిన దేశాంతరగమనమును నిరాకరించుటకు వలనులేక యున్నదిగదా! ఇదియునుంగాక దేశాంతరములనుండి జనులు పెలకొలది మనదేశమునకువచ్చి యిచ్చట మంచివిషయములనుజూచి గ్రహించి యావిషయములను దమతమదేశములకుంగొనిపోయి తమదేశస్థితిని వృద్ధిచేసికొని క్షేమము పడయుచుండ మనదేశస్థులు పరదేశములకుబోవుటగాని యాదేశములయందలి క్రొత్తవియముల నేర్చుకొని మనదేశమునకుంగొనివచ్చి దేశాభివృద్ధికొరకుపాటుబడుటగాని దురాచారమని తలచుట దేశక్షేమమునకు గొప్ప ప్రతిబంధముగదా!

ఇట్టిసందర్భములు ప్రాప్తించియుండ సందర్భానుసారముగ మహాజనులుచేరి కాలానుగుణ్యముగ నాచార

వ్యవహారములందు దగిన మార్పులు సమకూర్చుట కవకాశము మన దేశమునఁ గానరాదు. ఎవరైననట్టియుద్యమమును పూనుకొనినను, వారితో నేకీభవించి పనిచేయువారరుదు. కొందఱు చేరి పనిచేయఁబూనినను వారిని మహాజనులు దూరుటయే గానవచ్చుచున్నదిగాని యా యుద్యమమును గొనసాగనిచ్చునట్లుగానము. మతగురువులగు వారీవిషయములను యోచించుట లేదుగదా! చెవుల వేసికొనుటకైనను సమ్మతించుట లేదు. మతములయొక్కయు, మతాధిపతులయొక్కయు, అధికారము నైతము పూర్వమునందు సాగినట్లుసాగుటయును లేదు. ఎవ్విధముననైనను, తమయొక్కయు తమపరివారములయొక్కయు యోగక్షేమములను యోచించుటయు తమపదిభవమును కాపాడుకొనుటయు ముఖ్యోద్దేశములుగ, కాలోచితముగ "నోరులను నొప్పించక తానొవ్వక తప్పించుకొని" సంచరించుచున్నారు. ఒకరితో నొకరికి సంబంధము లేక "ఎవరికి వారే యమునాతీరే" అనుస్థితికివచ్చి సాంఘికములగు నేర్పాట్లు నిస్సారములై యున్నయవి. మహాజనుల సభ యనన దియెట్టిదో యిప్పుడెరుగము. మహాజనుల యభిప్రాయము మున్నదో అదియున్నయో. పండితుల పుస్తకములను జూచెదమన్ననో, విచారము నివారణమయి, అవి నిషిద్ధవాక్యములై, నిరుపట జగడములై న్యాయస్థానములలో వివాదములు దావాలును కొనవలసినట్లగుచున్నవి గాని యథార్థతత్త్వనిరూపణమెట్టిదో అపరిమితములలో నెరుగరాదు. ఎవరెన్ని దుష్కృత్యములనవలంబిం

చినను వారినాక్షేపించు ధైర్యమెవరికిని లేదు. ఇట్టి యబంధరస్థితియందు ద్రోవచూపి, సంఘమును సరియైన మార్గమునవలంబింపచేసి, కడతేర్చుటకు, అమానుషప్రజ్ఞగలిగి, సర్వజ్ఞులగు మహానుభావులవతరించి యామహానుభావుని శక్తిచే నెద్దియేనొక త్రోవగల్పించినచో సంఘము బాగుపడునేమోగాని లేనిచో నీప్రస్తుతపు దుస్థితిని నివారించుట కవకాశము లేదని దృఢముగఁజెప్పవచ్చును.

ఇట్టిదురవస్థ మనహిందూ దేశమునమాత్రము గాదు. పశ్చిమ దేశములన్నింటియందును మఱియొకవిధముగవ్యాపించియున్నది. ఇంగ్లండు, అమెరికా ఆస్ట్రేలియాలోనగు దేశములన్నింటియందు సంఘస్థితి యింతకంటెను చిందరవందరయయియున్నది. చదువరులును బుద్ధిశాలులునగువారు మతవిషయములలో పరతత్త్వమును చక్కఁగఁ దెలిసికొనవలయునను నాశగలవారైరి. మతబోధకులన్నానో జనులమనస్సులలో సంశయములే పుట్టరాదు, వారు పరిప్రశ్నలుచేయరాదు, మతగురు లేమి చెప్పిన దానిని బదులుచెప్పక నమ్మవలెను, అంతియు చాలును. వేరువిచార మక్కఱలేదని బోధించుటకారంభించిరి. బాహ్యకర్మములకు దగిన యంతరార్థముల బోధింపజాలకైరి. ఇవ్విధమున మతగురువులకును విద్యావంతులగు నితరజనులకును వివాదాంశములు పెక్కులు కాగావీరలలోమతాభిమానమునశింప నారంభమాయెను.

మఱియు కొద్దిమంది జనులచేతిలో ద్రవ్యమంతయుచేరి వారుమాత్రము కోటీశ్వరులగుటయు, సామాన్య

జనులు పెక్కండ్రు "దినములు మూడింటికి పూటలు రెండు" అనునట్లు చెప్పరాని బీదరికముతో బాధపడుచుండుటయు, అట్లు బాధపడుచుండు దరిద్రులకు విద్య నేర్పుటకుగాని సదాచారములను సత్ప్రవర్తనమును బోధించుటకుగాని యేర్పాటు చేయుటకు వీలులేకయుండుటయు, అట్టివారు మహాఘోరమగు వృత్తినవలంబించుచు, బాగుపడుట కవకాశము శుద్ధముగ లేకయుండుటయు, మఱియు దరిద్రులగు కూలివాండ్రందరు ఏకీభవించి సమితికట్టి పలుమాఱు పనులఁజేయమని తిరుగఁబడ దేశమున కమితములగు బాధలఁ గలుగఁజేయుటయు కడపట ప్రభుత్వమువారు తమ సైన్యములను వారిపై ద్రిప్పి వారిని స్వాధీనముచేసికొని వారిచే బనులఁ జేయించుటయు, ఈ యబందరస్థితిని సవరించుట కాయాదేశములయందలి యధికారుల కెంతటివారికిని దిక్కుదోచక నేమి యేర్పాటులుచేసినను తాత్కాలికములేగాని స్థిరములైన యేర్పాట్లుచేయుట సాధ్యముగాక యుండుటయు, ఇట్టి బాధలు మరలి మరలి సంవత్సరమునకు రెండు మూడు పర్యాయములు తటస్థించుటయు ఇవియన్నియుఁజూడ సామాన్యులైన మానవమాత్రులకు సవరింప నసాధ్యములగు సందర్భములున్నవనియును, ఇట్టి సందర్భములలో దగిన త్రోవఁజూపుటకు మహనీయుఁడెవడైన నవతరించినంగాని సాధ్యముగాదనియును చెప్పకతీరదు.

ఇదియట్లుండఁ ఐరోపాఖండములో ప్రబలియుండి యిపుడే ముగిసిన యుద్ధము జనుల కందరకు గొప్పవిష

యములను బుద్ధిగోచరములుగ చేసియున్నది. యుద్ధము నందు ప్రవేశించియుండిన జనాంగములు మాత్రము గాక ప్రపంచమంతయు బహువిధనష్టకష్టములకు పాల్పడెను గదా! ఒకరు తప్పుతోవను ప్రవర్తించినను జనులందరు దానిఫలము ననుభవించవలసియుండుట స్పష్టమగుచున్నది. స్వప్రయోజనపరత్వము స్వలాభాపేక్షయే జనులయందును జనాంగములయందును ముఖ్యభావముగ నుండుట చేతనే గదా యిట్టి యుద్ధములు కలుగుచున్నవి. అందువలననే గదా బహుకాలశోధనసాధ్యమైన ప్రకృతి శాస్త్రజ్ఞానమంతయు జనసౌఖ్యమునకును పురోవృద్ధికిని ఉపయోగించుటకు మారుగ జనక్షయమునకై వినియోగింప బడు నట్లేర్పడినది. యుద్ధమునిలిచి దాదాపురపదునైదుమాసము లైనను ఇప్పటికిని రాష్ట్రములయందు శాంతికుదరలేదు. పూర్వపు భావములు పద్ధతులు నిష్ప్రయోజనములైనవి. క్రొత్తభావములు పద్ధతులుపారంభించి స్థాపించుటకు శక్తిసామర్థ్యములు గలవారు కానరారు. ఒక్క-భావము మాత్రము నిలిచినది. మానవకోటియంతయు నొక్క-కుటుంబమువలె నెంచవలసియున్నది. యుద్ధాంతమున జనాంగముల కన్నింటికిని దృఢముగ నేర్పడిన భావమది యొక్కటియే. అందరు జనులును, జనాంగములును సోదరభావముతో ప్రవర్తించినం గాని యొక్కరును సుఖపడజాలరని యెరింగిరి. అందుకొఱకై యేగదా "ప్రపంచరాష్ట్ర సమితి" యేర్పడినది. ఇకముందు జనులయందు వలెనె జనాంగముల యందును రాష్ట్రముల యందును వివాదము

లు గలిగి సభ్యుసు మధ్యవర్తుల ద్వారా వివాదములను దీర్చికొను నేర్పాట్లుచేయవలయునే గాని కలహములకును యుద్ధములకును చోరరాదను నిశ్చయము అందరకును కొంతవరకు మనస్సునకు దోచినది. అయినను ఆభావమును కార్యరూపమున లోకమున స్థాపించుటకు వలయు శక్తిసామర్థ్యములు ఎవరియందును కానరాలేదు. మరియును ఎక్కడచూచినను ఇంత వరకు ప్రత్యక్ష విరోధులని యెంచుచుండిన వివిధ మతస్థులయందును సౌభ్రాతృత్వ న్యాయము వ్యాపించుచున్నయది. ఇదియును భావికాల నూతనధర్మ సూచకము కదా! భరతఖండమున నివసించుచుండుమహమ్మదీయసోదరులు హిందువులకు ప్రీతియొనర్చుటకై తమ పండుగలయందు గోవధ చేయుటమానవలయునని మహమ్మదీయ మహాజనసభయందు ఏకవాక్యముగ తీర్మానించుటపై చెప్పిన సౌభ్రాతృ భావము వ్యాపించుచున్నదనుటకు మంచిదృష్టాంతము. ఇట్టిమార్పులు ప్రపంచమున నచ్చటచ్చట యంకురించుచుండ అట్టి భవిష్యత్కాల ధర్మములను తనయందు మూర్తీభవించి తన ప్రవర్తనము చేతను బోధించుజ్ఞానము వలనను రాబోవువారలకు త్రోవచూపుమహనీయుడు, లోకమున నవతరించి ప్రపంచమునకు సాయము చేయు సమయము ఆసన్నమైయున్న దనుటకు సందియము లేదు.

ఇంకొక విషయము. అన్ని దేశములయందును అన్ని మతముల వారును శీఘ్రకాలములో మహానుభావుడు అవతరించ బోవుచున్నాడని యెదురుచూచుచున్నారు.

క్రైస్తవులలో అనేకులు వారి మతస్థాపకుడగు క్రైస్తు తిరిగి అవతరించు సమయ మని వారి "ద్వితీయ ఆగమనము"ను నిరీక్షించుచున్నారు. మహమ్మదీయులలో పెక్కండ్రు "ఇమాంమహాదీ" అను పెద్దలు శీఘ్రముగనే యవతరించునని నమ్మినిరీక్షించుచున్నారు. మన ఆంధ్ర దేశమునను వీరభోగ వసంతరాయుడు అను మహనీయుడు భూలోకమున అవతరించునను వార్త కొన్ని సంవత్సరములుగ ప్రబలియేయున్నది. ఇట్లుఅన్ని దేశములయందును అన్ని మతముల వారియందును అట్టి యవతారమును నిరీక్షించుట కానవచ్చుచుండుటయే అట్టి శుభోదయమును ముందుగ సూచించుచున్నది. అట్టి నిరీక్షణము మహాత్ములసంకల్పమునే తెల్పుచున్నదనుటకు సందియములేదు.

ఇంతియకాదు. పరతత్త్వవిషయమన్ననో, దానిని స్వానుభవముతో బోధించువారరుదుగనున్నవారు. ఎచ్చటజూచినను శబ్దజాలమును వితర్కించుటయు శబ్దప్రమాణమునుమాత్రమె యాధారముగ గొనుటయు గలదు. యోగాభ్యాసాదుల వలన యథార్థత్త్వము దెలుసుకొనిన వారపురూపమగుచున్నారు. ఒకరిద్దరు స్వానుభవజ్ఞానముగలవారు బయటవచ్చి చెప్పబూనినను వారలను విశ్వసించువారు లేకపోవుటయేగాక వారలనుదూషించి వారలయందు దోషదర్శనముచేయువారును వారల నెవ్విధముననయినను లోకనిందకు బాల్పఱునట్లుచేయయత్నించువారును పెక్కండ్రియిరి. మన దేశస్థులలో గొందఱు, అట్టి జ్ఞానము హీనమనువులకు అందును బ్రాహ్మణులకుం దప్ప

బ్రాహ్మణేతరులగు హిందువులకుగాని హిందువులకొఱ నితరులకుగాని గలుగ సాధ్యమే లేదని యభిప్రాయము గల వారలయి శమదమాదిగుణ సంపన్నులును, అపారభక్తి శోభితులును లోకోపకార పరాయణులును, పరిపూర్ణవైరాగ్యసంపన్నులునగు బ్రాహ్మణేతరులు హిందువులందుగాని తదితరులయందుగాని కానవచ్చినను అట్టివారు పరిపూర్ణభగవదనుగ్రహమునకు పాత్రులై యథార్థతత్వజ్ఞానమునుస్వానుభవముచే పొందియున్నను అట్టివారువిశ్వసనీయులుగారనియును వారివలననితరులు జ్ఞానముపొందరాదనియును లోకమున బహిరంగముగ ముచ్చటించుచు, సకల స్మృతులును,పురాణములును ,అంత్యజునియొద్దనుండికూడ పరతత్వజ్ఞానమును గ్రహించదగునని ఘోషించుచుండ నావాక్యములు గ్రాహ్యములు కావని నిరాకరించువారే ఇక్కాలమున నుపదేష్టలగుచున్నారు.ఐనను కేవల బాహ్యాకర్మములతో తృప్తిబొందక వానియంతరార్థమును యథార్థతత్త్వజ్ఞానమును తెలిసికొనవలయుననునాశ దినదినమునకుమానవులయందు హెచ్చుచునేయున్నది.అట్టియాశను తీర్చువారు అరుదుగనుండుటచే జనుల మనోభీష్టములీడేరక ఆకలిగొనియన్నమడుగ వారలకన్నము పెట్టువారు లేనట్లు జనులమానసములు కొందలపాటు చెందుచున్నవి. ఇవ్విషయమునను జనులమనస్సులను రంజింపచేయుతత్వవేత్తయొకమహానీయుండవతరించినంగాని లోకమునకు బురోవృద్ధియొనగూడదని చెప్పవలసియున్నది.

ఇట్లుండ లోకసంరక్షణ తత్పరులై సర్వజ్ఞులును,

తత్త్వదర్శులును, మహాదయాసముద్రులునగు మహనీ
యులు, జిజ్ఞాసువులగు శిష్యులు దొరకుదురాయని కాచి
యుండి యట్టివాఁడొకఁడు దొరికినను వాని యజ్ఞాన
తమస్సును దొలగించి జ్ఞానదీపమును వెలిగింప వేచియుం
డు మహానుభావులు, ఈ ప్రపంచ మిట్టిస్థితిని తత్తరపడు
చుండ వారి కటాక్షవీక్షణ మీదిక్కు సారింపక యుపేక్ష
చేయుదురా! పరుల యజ్ఞానమును దొలగించుట వారికి నై
జమగుగుణముగదా. ఇతరుల శ్రమమును దొలగించుట
వారిస్వభావముగదా! లోకమంతయు నీరీతిని దిక్కులేని
స్త్రీవలె మొరలిడుచుండ భగవంతునియొక్కగాని భగ
వత్సములగు మహనీయులయొక్కగాని యనుగ్రహము
ప్రపంచముపై ప్రవహింపక యుండునా? పూర్వయుగముల
యందు భూదేవి బ్రహ్మయొద్దకుఁబోయి మొఱపెట్టుకొనఁ
గా బ్రహ్మాదిదేవతలందఱు, మహావిష్ణునొద్దికో మహా
దేవునియొద్దికో పోయి మొఱలిడగా భగవంతుడగు మహా
విష్ణువో మహాదేవుఁడో అవతరించి లోకదుఃఖమును బా
పెనని మనము పురాణేతిహాస గ్రంథములలో చదువు
అఖ్యానములకిదియే అర్థముగదా? భూలోకమునందలి
ప్రజలందరు ప్రస్తుతపుస్థితిలోఁ దమకుఁ బురోవృద్ధి మార్గ
ము దోచక, దిక్కు తెలియక శ్రమపడుచు ఏ మహనీ
యుఁడువచ్చి మన కష్టములందీర్చునాయని యఱ్ఱులు
సాచుచుండుట, భూదేవి భగవంతునికడకేగి మొఱలిడు
టకాదా! అట్టిమొఱ మానవుల హృదయములయందు
బయలుదేరగా సర్వభూత హృదయాంతర్యామియగు

నీశ్వరుఁడామెుఅవిని లోకమున దానే యవతరించియో ఈశ్వరసములగుముక్తులలో నొకతి నవతరింపఁజేసియో లోకక్షోభమును మాన్పకుండునా!

ఎన్నివిషయముల నాలోచించినను ప్రస్తుతకాలము లోకమున నొక యమానుషుఁడగు మహనీయుఁడవతరించఁదగిన సమయముగ నున్నదనియును, అంతటి పుణ్య కాలమాసన్నమై యున్నదనియును, అట్టిరాక నిరీక్షించవలసి యున్నదనియును స్పష్టమగుచున్నది.

కావున పారమార్థికబుద్ధిగల వారందరు తాము ప్రతిదినమును ఆమహాప్రభువురాకకై ప్రార్థించుచు, తమ చిత్తములను శుద్ధిచేసికొని, వారికర్పణముగ భూతసేవ సేయుచు అందఱిమనస్సులను పక్వరచుటకు యత్నించవలెను. మహాప్రభువురాకల నిరీక్షించు శుద్ధాంతఃకరణముగల భక్తులు హెచ్చను హెచ్చను అంత శీఘ్రముగ లోకమునకీ మహాపుణ్యము సమకూరును. అట్టి పుణ్యోదయమునకై యెల్లరును పాటుపడుదురుగాక. మహానుభావుని అనుగ్రహము లోకమునకు శీఘ్రములో వ్యక్తమగుగాక. అందరును ప్రథమపుటలో సూచించిన విధముగ ఆమహాప్రభువును దినదినమును ధ్యానింతురుగాక.

ఓం శాంతిః శ్శాంతిః శాంతిః.

---

నందును, దేశాంతరములయందు జీసస్ క్రీస్తును, మహమ్మదు లోనగువారును లోకమున వెలసి తమతమ శిష్యులచే నిప్పటికిని,పూజింపబడుచున్నారుగదా! ఇప్పుడును అట్లే మహాపురుషుడొకడు అవతరించు సమయ మాసన్నమైయున్నది.

అట్లువారి యాగమనమునకై లోకమును సిద్ధముచేయుట ముఖ్యము. జనుల మనస్సులు యెంత శీఘ్రకాలములో పక్వమగునో అంత శీఘ్రముగ వారు లోకమున నవతరింతురు. వారు ప్రత్యక్షముగ లోకమున పనిచేయబూనుసమయమున వారి ననుగమించి భక్తిశ్రద్ధలతో పని చేయువారు పెక్కండ్రు కావలయును. కనుక జనుల భేదభావములను, కేవలస్వార్థపరత్వములను, తగ్గించి అన్యోన్య ప్రేమ పెద్దలయందు భక్తి సర్వత్ర సోదరభావమును అభివృద్ధిచేయవలెను. భక్తులు సాధువులు అన్ని దేశములయందును పెక్కండు నిశ్చలభక్తితో పనిచేయుటకుబూనిన గాని ఆ మహానుభావుం డవతరించుట సాధ్యము కాదు. పూర్వమున భూభార మెక్కువయినపుడెల్ల, నాభారమును దగ్గింపవలెనని భూదేవి బ్రహ్మయొద్ద మొరపెట్టుకొనగా భగవంతుడుం డవతరించుచుండెనని పురాణములు ఘోషించుచున్నవి. ప్రపంచమున జనసామాన్యము కేవలస్వార్థపరులై, ధర్మము క్షీణించి అధర్మము హెచ్చినయు స్వప్రయోజనమునకై యన్యుల హితమును భంగముచేయు వారలే రాక్షసులని భర్తృహరి వచించియున్నాడు. ఇదియే భూభారము అధికమగుట. భక్తిప్రేమలు వృద్ధిచేయుటయు అమ్మహనీయుని రాకకు ప్రపంచమును సిద్ధముచేయుట. ఆపనిచేయుటకే యీ "తారకసంఘము" అను సమాజము స్థాపింపబడినది.

సమీపకాలములో నొక మహాపురుషుడు లోకమున నవతరింపబోవునని|నమ్మువారందఱు ఈసమాజముగ నేర్పడియున్నారు. ఆ సమాజమునకు "మహాపురుష సేవాసమాజము" అని పేరిడబడినది, ఆంగ్లభాషయందీసమాజము "ఆర్డరు-ఆఫ్-ది-స్టార్-ఇన్-ది-ఈస్ట్" అని పిలువఁబడుచున్నది. ఈసమాజమున అన్ని దేశములవారును. అన్ని జాతులవారును అన్నిమతములవారును సభ్యులుగనున్నారు. ఇందుదివ్యజ్ఞానసమాజసభ్యులు, పెక్కండ్రున్నను ఆ సమాజమునకు చేరనివారింక అనేకులున్నారు. కావున నీసమాజము దివ్యజ్ఞానసమాజశాఖ కాదని

స్పష్టముగ తెలిసికొనవలయును.

ఈ సమాజము 1911 సం॥ జనవరి తేదీని స్థాపింపబడినది.

ఆంధ్రదేశ తారకసంఘమువారు "తారకసందేశము" అను తెలుగు చిన్న మాసపత్రికను ప్రచురించుచున్నారు.

ఈ సమాజసభ్యులు నిర్బంధముగ నొప్పుకొనవలసిన సిద్ధాంతము లెవ్వియులేవు. సమీపకాలమున శ్రీజగద్గురువు అవతరింపబోవుచున్నాడనుమాట మాత్రము సామాజికులందరు ఒప్పుకొనవలయును.

అవతరింపబోవు మహానీయుండగు శ్రీ శ్రీ జగద్గురువు ఒకదేశమువారికి మాత్రముగాని ఒకజాతి లేక వర్ణమువారికి మాత్రముగాని కాదు. కావున నా రేరూపమున వచ్చినను ఏశక్తిని ధరించినను, ఏ మతమువారి గర్భమున జనించినను ఆ బాహ్యములగు జాతి, వర్ణ, కులము, వయో, లింగములను ప్రధానముగ నెంచక వారు బోధించు జ్ఞానమును వారి ప్రభావమును బట్టియే వారిని గుర్తింపవలయును.

కావున లోకముయొక్క శ్రేయస్సును కోరువారందరును, లోకమును సుధరింపగలుగు మహాత్ముని యునికి శుభవార్తను వినగా వారి హృదయములు ఉప్పొంగి భక్తిపూర్ణహృదయమున ఎదురుచూచుచు, ఆ మహాత్ముని బిడ్డలగు సమస్తమానవుల సేవచేయుటద్వారా వారి సేవకు యోగ్యత సంపాదించుకొను ఉత్సాహముగలవారలై తమ తమ హృదయములయందు వారిప్పుడే యావిర్భవించియున్నట్లు తెలిసికొని భక్తితో వారు ప్రవర్తింపదగు మార్గమున ప్రవర్తించుటకు సామర్థ్యములు వారికి కల్పించి పరస్పరభంగుల ప్రయత్నించెదరుగాక!

నీ పాదకమలసేవయు, నీ పాదార్చకులతోడి నెయ్యమును, నితాంత
అపారభూతదయయును, తాపసమందార నాకు దయచేయగదే.

ఈ సంఘమునకు సంబంధించిన యావత్తు సలహాలకొరకుగాని దరఖాస్తు నమూనాలకొరకుగాని యీ క్రింది విలాసమునకు వ్రాసికొనవలసినది.

వి. యన్. రాజగోపాల అయ్యంగారు,
అసిస్టెంటు ఇంజనీయరు,
బెజవాడ.

